# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



డిశంబరు 1959

సంపుటము 36 : : సంచిక 12

---

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిశంబరు 1959



## జనవరి సంచికలో

# వార్తలు

## శ్రీ సంజీవరెడ్డికి కాంగ్రెస్ అధ్యక్షపదవి

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. ఆయనతో పోటీ చేయదలచినవారందరూ నామినేషనులు ఉపసంహరించుకున్నారు. శ్రీ రెడ్డిగారి పేరును శ్రీమతి ఇందిరా గాంధీ, పంత్, మొరార్జీలు ప్రతిపాదించారు.

## చైనా చర్యపై అమెరికా ఖండన

చైనా ఇండియా సరిహద్దువివాదంలో ఇండియా వాదం, హక్కులు సక్రమమైనవని అమెరికా అభిప్రాయపడుతున్నట్టు అమెరికా విదేశాంగమంత్రి శ్రీ క్రిస్టియన్ హెర్టర్ నవంబరు నెలలో వాషింగ్‌టన్‌లో ఒక పత్రికా ప్రతినిధులగోష్ఠిలో అన్నారు. చైనా బలప్రయోగం చేసిందని ఇది చాలా తప్పని ఆయన అన్నారు.

హెర్టర్ ప్రకటనపై అమెరికాలో పెద్ద గాలి దుమారం రేగింది. దానిపై హెర్టర్ భారత రాయబారి కార్యాలయం ప్రతినిధిని పిలిపించి తన ప్రకటనను విశదీకరించాడు.

## కాంగ్రెసు అధిష్ఠానవర్గం తీర్మానం

చైనా - భారతదేశాల సరిహద్దు వివాదం విషయంలో భారత ప్రభుత్వం అనుసరించ నిశ్చయించిన విధానాలను, క్లిష్టపరిస్థితిని ఎదుర్కొనడానికి జరుపుతున్న చర్యలను కాంగ్రెసు అధిష్ఠానవర్గం నవంబరు 10వ తేదీన బలపరుస్తూ తీర్మానించింది. తగినచర్యలు తీసుకోవాలని, అయితే, అలాటి చర్యలవల్ల భారతదేశపు అఖండత్వానికి భంగం కలుగరాదని, ఏవిధంగాను దురాక్రమణను అంగీకరించినట్టు కాకూడదని ఈ తీర్మానంలో స్పష్టపరచబడింది.

## శ్రీ కురుగంటి సీతారామయ్యగారి మృతి

సుప్రసిద్ధ పరిశోధకులు, విమర్శకులు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు నవంబరు 4 వ తేదీన నాంపల్లి (హైదరాబాద్)లోని స్వగృహంలో మరణించారు. వీరివయస్సు 70 సంవత్సరాలు. వీరు నవ్యాంధ్ర సాహిత్యవీధులు, తంజాపురాంధ్రనాయక చరిత్ర మున్నగు గ్రంథాలు రచించారు. నవ్యసాహితీ సమితి మాజీ అధ్యక్షులు. పారిభాషికపదకోశ సంఘ సభ్యులు. వీరు లోగడ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. నిజాం కాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగ ఉన్నారు. తర్వాత, ఉస్మానియా విశ్వవిద్యాలయ తాళపత్రగ్రంథాలయంలో పరిశోధకులుగా ఉన్నారు.

## కూచిపూడి బృందం పర్యటన

కేంద్రప్రభుత్వం శాస్త్రపరిశోధన, సాంస్కృతిక వ్యవహారాలశాఖ అమలుజరుపనున్న పథకం ప్రకారం ఆంధ్రప్రదేశ్ నుండి కూచిపూడి నాట్యనటక బృందాన్ని కేరళ-మైసూరు రాష్ట్రాలలో పర్యటనకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పంపించనున్నది.

## అజాద్ కాశ్మీర్ మాజీ అధ్యక్షుని అరెస్టు

ఆజాద్ కాశ్మీర్ మాజీ అధ్యక్షుడు సర్దార్ మహమ్మద్ ఇబ్రహీం రావల్పిండిలో పాకిస్తాన్ సైనిక శాసనం కింద అరెస్టు చేయబడ్డాడు. ప్రభుత్వంపై అసంతృప్తిని, విద్వేషాన్ని రెచ్చగొడుతున్నాడన్న ఆరోపణపై ఈ అరెస్టు జరిగింది.

## తూకేర్ గ్రాం విముక్తి

అస్సాం-తూర్పు పాకిస్తాన్ సరిహద్దులో ఉన్న భారతగ్రామం తూకేర్ గ్రాం 14 మాసాల తర్వాత నవంబరు నెలలో మరల భారతదేశం అధీనంలోకి వచ్చింది. దీనిని లోగడ పాకిస్తాన్ పెక్కుసార్లు కాల్పులు సాగించి ఆక్రమించుకొన్న విషయం పాఠకులకు విదితమే. రాడ్‌క్లిఫ్ అవార్డు ప్రకారం మరి కొన్ని గ్రామాలపై అధికారం కూడా ఇండియాకే సంక్రమించింది.

## ఇండియాకు చెకోస్లోవాకియా ఋణం

భారతదేశంలో పరిశ్రమల అభివృద్ధి కోసం చెకోస్లోవాకియా భారతప్రభుత్వానికి 28 కోట్ల రూపాయలు ఋణమివ్వడానికి ఒడంబడిక జరిగింది. దీనిపై భారత పరిశ్రమలమంత్రి శ్రీ మనూభాయిషా, చెకోస్లోవాకియా విదేశీ వ్యాపారశాఖామంత్రి ఎఫ్. క్రాసిర్ సంతకాలు చేశారు.

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఎదలోని బాధకు భావనాదీప్తికెల్ల విరామ
మొదవిన మెచ్చోటనో నిరాకార మూని యుందువని
మది నమ్మఁజాలని భావతీవ్రత మదిలోని నొవ్వ
పొద నీవు తోప శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఇది కాదటంచు నాబ్రదుకు నేను యథేచ్ఛంబుగాఁగ
బ్రదుకుచు మరి మధ్యమధ్య నీవు కన్పడవంచుఁ దెనుగు
పదములు వ్రాయుచు నాటకంబుగా భావింతు వేమొ
సుదతీకృతార్థ శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నా నమ్మక మ్మిది స్వామి నాథ నాదు జన్మములచేతఁ
బూని తా నియమితమయ్యె వాసుకిభోగికేయూర
దీనిచే నిన్ను భావింతు నైరమ్మనీయమా వరసి
సోనవుగాఁగ శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నీలలోహిత ప్రొద్దుక్రుంకినంతనే నీ వా వెనుకను
వ్రాలివత్తువని మెఱుంగుదున యమ్మవారి వా నగలు
వ్రాలుచందురురేక శుక్రగురువుల బావిలీల్ పాప
సూలచేకట్లు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

ఒనరైనయంతలో నా మన స్సూరియూరియున్నయది
వనితాధనోహలే యుప్పకార మావయు నూని యనగ
తనర బండను వేసి రాచినం బోదు దానిలక్షణము
సౌన తావి చెడదు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

పిచ్చి తాఁ గుదిరినఁగాని యోస్వామి పెండిలి కాదు
పిచ్చి తాఁ గుదురదు ప్రాణనాయక పెండ్లైనఁగాని
హెచ్చి నిన్నూహింతు మనసుచేతనే యిది చావ దీవు
చొచ్చినఁగాని శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

చెట్ట యీ మనసున కయ్యె సిగ్గువచ్చియు సిగ్గురాదు
పట్టినచోటనే పాముకరచియుఁ బట్టు నచ్చోటె

చుట్టపెట్టి హరింపు గీవిని మరుగుచొచ్చితి నాత్మ
చుట్టమవంచు శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

ప్రళయంబు లెన్నైనఁ గడచుదాఁక మార్కండేయునట్లు
ఇలమీఁద నుంచుమంచంటినా జన్మ లింకేమి నాకు
వలదంటినా నాదుతలపులో నీవు వచ్చి నిల్చుంటి
చులుకచేసితివో శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

అనుభవస్మృతికంటె పెద్దసుఖము లే దనుభవవేళ
ననుభవవేళయందు సుఖ మున్నచో నదియు భావనయ
పనితభావన కింత హాయి యున్నమా పరికరణమేలో
చూపినా వీవు శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

నమ్మితి నుపనిషదర్థముల్ నిన్ను నమ్మితి నిన్ను
నిమ్మోము నమ్మినో నీవుచేసెడి దేమియులేదు
నమ్మినవ్వాడు చేయునదూరయ్యా యీ నాకు నిమ్మనని
సొమ్ములు నీవి శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

ఏ వేళ నినుఁ జూచినానో యా వేళ నీకుండకాయ
కాపు నేసితి గంగుమారి వృంతమ్ముకడఁ జక్కపాడిచ
సేవింపఁగా నీవు నెంచవేలో పచ్చి మరిందు కలిమి
చూపె మిక్కిలిగ శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

ఒకవేళ నే నెఱుంగకయ సేవించుచుంటి నేమో య
యకటంబ! సేవించనట్లుగ నభినయంబు సేయుచును
ముకుపుటంబునఁ బెట్టి యాఘ్రాణముం జేయు దేమొ
సుకుమారమూర్తి శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

నీ వంతరాత్మలో నిలచి పలికిన నిగుడుయత్నంబు
దేవి శారదగ భాసించె నా దేవి దేవ! భవత్కృ
పావృష్టిఁ దగు నాదు జిహ్వాతుదఁ బైకిఁ బ్రాఁకిన నచట
చూపె నీయునికి శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

పరగ నా శారదాదేవి నీనుండి బయలుదేరినది
సరసిజభవురాణి యొక్క ధార నాసన్నిధిఁ బ్రాఁక
హర! నన్ను నాధారవెంట నీవద్ద కరుదేరనీవె
సురనదీచూడ! శ్రీశైలమల్లికార్జునమహాలింగా!

# శాకుంతలము: రవీంద్ర కవీంద్రుడు

శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు

ఇప్పటికి ఇంచుమించు రెండేండ్ల క్రిందట ప్రకటితమగు మదీయ శాకుంతల రసాస్వాదినిని శ్రీ బెజవాడ గోపాలరెడ్డిచేత నంపితిని. ఆయన విజ్ఞాభినందనమును తెలుపుచు, మహాకవి ఠాగూరుగారి శాకుంతల పరామర్శలును పరామృష్టము లైనవికదా అని యడిగెను. అందులకు నేను వారి పేరు కూడ ఉదాహరింపబడియే యున్నది అని యంటిని. అట్లే కదా,—'అది(శాకుంతలము) సాహిత్యం గోలిచిన తొంటి యాచార్యులగు ఆనందవర్ధనాభినవగుప్తాదులయు నేటివారగు అరవింద ఘోషు ఠాగూరు రవీంద్రాదులయు బహుమానపూర్వక పరామర్శల నందియున్నది.' అని. (రసాస్వాదిని—ఉపోద్ఘాతము-పుట-1.) వినను రవీంద్ర శాకుంతల విమర్శను అంతయు కాని నేను అంతకన్నను ప్రస్తావించినవాడ గాను. అట్లు ప్రస్తావింపమి "వృద్ధా స్త్రీ, న విచారణీయచరితా స్త్రీవృత్తస్య కిం వర్ణ్యతే?" "ఇంగుగు జ్యాయముల్. తెలుప నొప్పగు వారి చరిత్ర, యుండనీ" అను లక్షణాక్య న్యాయమున నే.

రవీంద్రుని శాకుంతలప్రశంస సర్వమును యూరపు జర్మను కవిసమ్రాట్చక్రవర్తి గెటే పలికి నన్న తత్ప్రశంసాగీతికకు తన విపులవ్యాఖ్యయే అన్నాడు. గెటే గీతికకు ఇది ఆంగ్లానువాదము—

Wouldst thou the young years'blossoms and the fruits of its decline,

And all by which the soul is charmed, enraptured, feasted, fed?

Wouldst thou the earth and heaven itself in one sole name combine?

I name thee Sakuntala, and all at once is said.

"నీకు బాల్యపు (ఎలజవ్వనపు) కుసుమములు కావలయునా, అదితీతి వీగిపోయిన నాటి ఫలములుం గావలయునా? అంతయు కాక, ఆత్మ దేని సంతృప్తిం గొనునో, సుఖపరవశ మగునో, పండువు గనునో, విందారగించునో అది యెల్లను గావలయునా? మన్ను మిన్ను—భూమియు స్వర్గమును ఒక్క (పేరి)టనే కలుపం గోరికయా? ఈ యన్నింటికిని, ఓ శకుంతలా, నిన్ను నే పేర్కొందును. అంత సర్వమును నొక్కుమ్మడి చెప్పబడిన దగును, చరితార్థమగును." ఇది దానికి ఒకపాటి ఆంధ్రానువాదము. గెటే యీ శాకుంతల ప్రశంసకు కారణము నేను ఒకడుగా ఊహించి ఆ రసాస్వాదినియందు ఇట్లు తెలుపుకొనియుంటిని. "ఉదాత్తవృత్తపూర్వ (షేక్స్పియరు నాటక గతి) రసాభాసాదిచరిత్రలందు, తన్మహిమాభినయలందు, రసవమున్నను భావముల యొక్క 'సంవిధానము' కాని, పరనిర్వృతికర లలితలాస్యము లేదు. అట్టి నాటకకాదు యుదాత్త తోచిన యయు. కావున గాబోలు, మహాకవిసామ్రాట్చక్రవర్తి గెటే తనకు భావుకుడు గాను సాక్షాత్తు జీవుడు గాను తోచి, తన చిత్తమున కడికట్టించె నని ఆరాధనముచేసి తాంతో స్తోత్రము లందిన షేక్స్పియరుగారి ఆ తాండవమునకు మిక్కిలి అబ్బురపడుచు నే ఉత్సాహము పొంది కాళిదాసు శాకుంతలములోని చల్లని యీ 'లాస్యమునకు' సంతసించి దానిని ఇట్లు నాగరికంపు దొరయించినాడు-'Wouldst thou' ఇత్యాది. ఇంతయు బాలగింటి యూంగ్లించూడ మాడి భోగించినట్లు గాక, హిమవత్సింధుసంశ్రితయు అతిమూర దేశవాసినియు, పరిశుద్ధశీలయు. తనయూగిక మర్యాదగా నచ్చిన విందును అను నాగరాణి శకుంతలను ఒకపాటి రూపముగా మనిగా ఉంచి చూచి మెచ్చుకొనియే చేసినది యీ స్తోత్రపాఠమని తలంతురు కాబోలు" అని. మఱి ఠాకూరు రవీంద్రనాథుడు గెటే ప్రశంసాగీతికపై ఇట్లు వ్యాఖ్యానించుచున్నాడు. "మనము ఈ ప్రశంసను వట్టి కవనపు పొంగు అని పోనిత్తుము. దాన గెటే శాకుంతలమును మిక్కిలి అందమైన కావ్యముగా ఎంచెనని తలంతుము. కాని, నిజముగా అది యట్లు గాదు. ఆతని పద్యము వట్టి యానందపారవశ్యపు మెచ్చుకోలును అతిశయోక్తియు గాదు. మఱి విమర్శకుని లెస్సగా అరసిచెప్పిన నిర్ణయము. అతని మాటలలో ఒక ముఖ్యమైన నిర్దేశము గలదు. శాకుంతలమున ఒక క్రమవృద్ధిని మార్పును గూర్చిన

చరిత్ర స్పష్టముగా తోచి ప్రకాశించును అని ఆయన చెప్పుట—పూవు పెరిగి కాయగా మారుట, భూమియే స్వర్గముగా పరిణమించుట, అచిత్తు చిచ్ఛక్తిం గనుట. నిజముగా శాకుంతలమున రెండు సంయోగములున్నవి. నాటకమున కవియుద్దేశ్యము నాటకప్రథమాంకము లోని తొలి సంయోగము ఐహికము-క్షణికము-అందపు వలపు విలాసములోడిదియు, కడయంకములోని యా యుత్తమ సంయోగముగా, నిత్యశాశ్వతానందము స్వర్గాశ్రమపదములోనిదిగా మారుటం జెప్పుటయే. ఈ నాటకము ఏదేని యొక తీవ్ర మనోభావముం జెప్పుటకుగాని ఏదేని యొకపాత్ర శీలముం బోషించుటకు గాని ఉపక్రమింపబడినది గాదు. మఱేమనగా, సర్వము ఒక లోకమునుండి ఇంకొకలోకమునకు, అధోలోకమునుండి ఊర్ధ్వలోకమునకు మార్చుటకు, రాగము క్షణికగ్రామ్య శరీరాంగరామణీయకమువీూది నుండి స్వర్గనిత్యశక్త రామణీయకము మీదికి ఎక్కించుటకు ఎగిరించుటకు ప్రవృత్తమైనది......." అని.

రవీంద్రుడు మఱియును చెప్పుచున్నాడు. "కాళిదాసు ఈ పరిణతిని, అదే స్వర్గ మర్త్యలోక సంయోగమును అవలీలగా సాధించినాడు. అతని మర్త్యలోకము స్వభావానుగుణముగానే ఎంతిలో ఎక్కడ స్వర్గమునో ఆ హద్దును మనము, మెలకువతో నైనను, కనిపట్ట లేము. తొలియంకమున శకుంతల పతనముయొక్క గ్రామ్య ప్రకృతి కవిని దాగురింప లేదు. నాయకుని నడువడియుం జేమి నాయిక నడువడియుం జేమి అభిలాష పతనమునకు ఎంతగా కారణ మాయెనో స్పష్టముగానే చూపినాడు. యౌవనమునను కల్పించు ఒండొరుల పొంగడికలు, క్రీడారతి, దుందుడుకు-ఇవెల్ల నిండార విన్యస్తమైనవి. అల్లే గాటంపు సిగ్గునకును, ఆత్మభావప్రకటనకును పెను పెనఁగులాట. శకుంతల మౌగ్ధ్యమునకు, అదే చేలతనమునకు, ఇది యొక తార్కాణ. దుష్యంతసమాగమునకు వలయు భావతీవ్రతకు శకుంతల సన్నద్ధగాదు. తన్ను ఆపుకొనుట కేని, తన భావమును కప్పుకొనుట కేని ఆమె ఎఱుఁగదు. ఇంకను ఆమె అజ్ఞాతమదన. కావున ఆమె చిత్తమునకు తగిన వర్మ మేమియు లేదు. అందు లేచుచున్న రాగమును నమ్మకపోవుటకు గాని లేవుచున్న కాంతుని శీలమును సందేహింపనుం గాని, ఆమెకు దిటము చాలదు. ఆశ్రమబాల, అచట భయమెఱుఁగని మృగశాబమువలె నే, వట్టిబేలగా నుండెను. దుష్యంతుడు శకుంతలను వశీకరించుటను చాల స్వాభావికముగా నే చెప్పినాడు, అంత సులువుగానే సమకూర్చినాడు, కవి, శకుంతల పతనపుబవిత్రతను, సహభావపు ఉదభంత పాతివ్రత్యమును. ఇది శకుంతల యొక్క లేమికి, అతి మౌగ్ధ్యమునకు మఱియొక తార్కాణ. అడవి పూల రేకుల ధూళిని ఏ తోటమాలియు తుడువబోలేడు. అవి అనావృతములే. వానిపై ధూళి దుమ్ము చేరును. చేరినను, అవి తమ రమణీయ నైర్మల్యమును గోలుపోవు. శకుంతలపై మఱక పడవేయబడినది; ఐనను అది ఆమెను తెలియనే లేదు. ఆదియున్నను, బాలహరిణమువలెను, కొండయూటవలెను ఆమె నిర్మలముగానే విరాజిల్లినది."

మఱియుం జెప్పుచున్నాడు, రవీంద్రనాథుడు- "ఆశ్రమమున పెరిగిన యౌవనము సహజపవిత్రబంధము తోనే తన స్వభావమును అనుసరింపించినాడు. ఎక్కడను కుందలేదు, అడ్డలేదు. ఐనను ఆమెను పతివ్రతల మేలుబంతిగా ఎదిగించినాడు. ఆమె గాంభీర్యమును, దుఃఖసహనమును, ధరనియమపరతను ప్రోదిచేసినాడు. తోటలోని ఆమె మనకు తన్నుదా మఱచుచు, తీవవలెను పూవువలెను, స్వభావము ఎటు ప్రేరించిన అటు పోవుచు నడచుచుండినది. కడపట ఆమెయొక్క ప్రాతివ్రత స్త్రీ స్వభావము అనిర్వాచ్యమైనది—ఆ శాంతి, కష్టములందు ఆరోగ్య వ్రతముల ఆ నియమపరత, ఆ పరమ భక్త్యనుష్ఠానము. సాటిలేని శిల్పముగా కాళిదాసు తన నాయికను చేష్టలకుం భావములయు, స్వభావ స్వేచ్ఛ కట్టుబాటులయు, విలు సముద్రములయు కూడలి హద్దుపై నిలిపినాడు. ఆమె నాయన మహాముని; ఆమె యమ్మయో అప్సరస; ఆమె జన్మ తపోభంగమువలం గలిగినది. మఱి యామె పెరుగుట తాపసాశ్రమమున, అనగా స్వేచ్ఛయు తపస్సును, అందమును ఆకయు అవిరుద్ధముగా కలయుచోట. అందు సంసారపు కృత్రిమంపు కట్టుబాటులు లేవు గాని, అంతకన్నను కఠినములు ధర్మనియమములు గలవు. ఆ గాంధర్వవివాహమును ఆ తెఱంగుదే. ప్రకృతి(=సహజ) నిరంకుశతను పెండ్లిబంధముతో కూర్చుట. శాకుంతలనాటకము భావలో తనకుతానే అద్వితీయమై సాటిలేకయున్నది; ఏలన ఆగను స్వేచ్ఛతో పొందుపఱుచుటను వెలయించుచున్నందున. ఈయాక స్వేచ్ఛల సంఘర్షణమున బుట్టినవే అందలి సంతోషములు, దుఃఖములు, కలయికలు విడిపోవుటలు-అన్నియు... ...శకుంతల చేలతనము స్వభావసిద్ధము;......అజ్ఞానమునం గలిగినది కాదు. తొలి యంకమున శకుంతల చెలులిరువురును ఆమె యభినవ యౌవనమును ఆమెకు జ్ఞాపకము సేయుచుందురు. ఆమె సిగ్గుచెయిదములు కేర్చు

కొనును. ఐనను ఇవన్నియు బాహ్యవిషయములు. ఆమె శీలతీవ మన్ననో ఆంతరంగికమైనది. అట్లే ఆమె పరిశుద్ధియు. ఆదినుండి అంతమువఱకు కవి ఆమెను బాహ్యప్రపంచానుభవములేని దానింగానే చూపును. ఆ శీలతీవము చాల లోతైనదియు, స్వశక్తిసిద్ధమును. ఆమెకు బాహ్యప్రపంచము ఇంకను ఎఱుకరాదు; ఏలన ఆశ్రమము దానితో ఇంచుక పరిచయము కలిగినదే. అందు గృహకార్యములు పాటింపబడుచునే యున్నవి. శకుంతల బాహ్యప్రపంచమును బొత్తిగా ఎఱుంగనిది కాకున్నను దాని యనుభవము ఎంతయు చాలనిది. ఆమెకు మనసున ఎందును సహజవిశ్రంభము రూఢిగనియున్నది. ఆ సులభ విశ్రంభమున గలిగిన యా శీలతీవమే ఒక నిమిషమున శకుంతలను అట్లు పతనం ప్రదోషించినది. మఱి అదియే ఆమెను శాశ్వతముగా ప్రోచి నిలువబెట్టినది. ఆ విశ్రంభమే ఆ యతిక్రూర విశ్వాసఘాత కలిగినపుడును ఓర్పును శుచిని ప్రీతిపోషణయను ఆమెయందు నిలిపినది..................."

రవీంద్రుడు ఇట్లు శకుంతల శీలమును అతి నిశితముగా పరీక్షించినాడు. ఇట్టి యీ ముగ్ధ, నవయౌవన, శకుంతల చెలులంగూడి దుష్యంతునికి దక్కినట్టిది నవవసంతోత్కంఠంబోనిది గేటే చెప్పిన తీవమీది నవకము మాయని క్రొత్త పూలమంజరి కాబోలు. (the young years' blossoms.) ఐనను అట్లు ఆశ్రమధర్మమున నున్న యామె దుష్యంతునిపై అభిలాష గొనుట పతనమని ఠాగూరు విశ్వకవిచే పలుమాఱు నిర్దేశింపబడినది. దుష్యంతుడు ఆమెను అట్లు పతనలాగి పాశనియు సూచింపబడినది. దాని వామె మీద అపవి పూలమీద గాలిదుమ్మువలె ముఱికి పడజేపడినది అనియు, ఐనను ఆమె పరిశుద్ధికి నిర్మలతకు సేగి కలుగలేదనియు చెప్పబడినది. 'ఆమె అజ్ఞాతమదన. ఆమె చిత్తమునకు తగిన వర్మమేమియు లేదు. అందు లేచుచున్న రాగమును సమ్మతపోవుటకు గాని లేపుచున్న కాంతుని శీలమును సందేహింపనుం గాని ఆమెకు దిటము చాలదు.' అనియు ఉపన్యస్తము. ఇందు దుష్యంతుడు, పాపము శకుంతలను ఏమో చేసినాడు అని సాధులోచునట్లు ఉన్నది. ఆ మూడంకముల శృంగారము మీద గ్రామ్యతాముద్రయు మోసపుమైలయు కొట్టవచ్చినట్లున్నది. శృంగారమే "అసభ్యపరిపాటికామధికరోతి" అనకుండా ఠాగూరు.

రామసీతలకో, అర్జునద్రౌపదులకో, ఉషానిరుద్ధలకో, ఉత్తరాభిమన్యులకో—అట్టి క్రొత్త వయసులో నున్న దుష్యంతునికి శకుంతలకునో అయోగశృంగారమును, తగిన సంవిధానము కల్పించి చెప్పియున్న రమణీయతరమే యగు నేమో. అప్పుడు నాయికలవలె నాయకులను, రామార్జునులును, అనిరుద్ధాభిమన్యులును క్రొత్త యువకులు ఇకే తొలుదాలుగా మన్ననుని కగ్గమాట—తామును తొలి పతనము గనుట-అయోగశృంగారమునకు ఆలంబనములట అభిలషణీయతరమే యగు నేమో. అట్టి యయోగశృంగారము మహాకవులు చెప్పినది మనకు అంతగా దొరకలేదు. నాగానందమున జీమూతవాహనుని శృంగారమొకటే ప్రసిద్ధముగా నున్నది. మాలతీమాధవ మల్లికామారుతాదులను కొన్ని కలవు. (కావ్యమున కాదంబరీ పుండరీక మహాశ్వేతలదియు కాదంబరీ చంద్రాపీడులదియు సరిదముకొంతకాదియు అట్టిదే.) అయినను ఆ కవుల గూర్ప్రతిభ కాళిదాసుని ప్రతిభమునకు ఏపాటి? లెక్కకు రాలేదు. ఏలన బహుభార్యత్వ, విశేషముగా తృప్తిచుండుడు. శ్రుతి స్మృతి శిష్టాచారముల ననుసరించె సాధుతతో సేగులు పాటియున్న మన హిందూచిత్తమున దుష్యంతుని యీ యయోగశృంగారమున దోషముగాని అసుభగత గాని లోపదు. సాటిలేని శృంగారకవియగు కాళిదాసుని ముప్పురు శృంగారనాయకులును దుష్యంతపురూరవాగ్నిమిత్రులు బహుభార్యులే. మఱి శృంగారమునకు ఇంతకన్న వన్నెగొన్న నాటకములు లేవు. దుష్యంతుడు శకుంతలపై అభిలాష చెందుట, అంతట అయోగమున క్రాగుట, శకుంతలం బొందుట కాని, శకుంతల దుష్యంతునిపై అభిలాష చెందుట, అంతట అయోగమున క్రాగుట, దుష్యంతుం బొందుట కాని, 'పతన' మగునా? అది అతిపవిత్ర చరిత్రమే యని హిందువుల సంప్రదాయము. దుష్యంతుడు అభిలాష చెందుచు తన చిత్తమును ఎంతయో పరిశీలించుకొనును. 'అసంశయం క్షత్రపరిగ్రహక్షమా, యదార్యమస్యామభిలాషి మే మనః, సతాం హి సందేహపదేషు వస్తుషు, ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః॥' అని తీర్మానికొనును. ఇది యూరక ఇంద్రియవశతచే తన మనస్కునకు మాటగా చూచుకొని అసాధువును సాధువని రొంచుకొనుట గాదు. దుష్యంతుడు నిజముగా గొప్ప 'సత్ప్రభువు', ఆయనమనస్సు నిజముగా ఆర్యము, ఆ యభిలాష ఎంతయు తిరస్కృతము అని దానిపై కుమారిలభట్టు, గొప్ప మీమాంసకాచార్యుడు తంత్రవార్తికమున ఇట్లు ప్రమాణముద్ర వైచినాడు.

'యథా రుమాగాం లవణాకరేషు
మేరా యథాపోజ్జ్వల రుక్మ భూమౌ,
య జ్జాయతే తన్మయ మేవతత్స్యాత్

హా స్థితిలో స్వర్గసుఖంబోలె అనుభవింపవలయు శుభాకాంక్షలు పలుకును.

ఎందును తొలిచూపులోని యా పూర్వరాగమును పెండ్లియు సంభోగమును చెప్పిన యీ దంపతులు నిరంతరాభ్యాసానుభవమున నే సంతానము కలిగి కలసి మెలసి కూడియుండి 'భూత్వా చిరాయ చతురన్త మహీసపత్నీ' అని చెక్కిళ్లు, నడుమ శాపవ్యవధానము లేక ఒక్క తీరుగ గార్హస్థ్యము గడిపి అంతికి వానప్రస్థమునకు చేరిన అది లోభనీయమును ప్రశంసనీయమును అగు చరిత్రము కాదా? వారి యనురాగము పవిత్రము గాదా? అపవిత్రమే అగునా? 'శకుంతల యా దీర్ఘ విరహ సమయములు దుష్యంతునితోడి యామె తొలి సంయోగ దోషములను కడిగివైచినవి.' అనగా ఏమి? అట్లేల అనవలయును? ఇటును అటును ఆ శాపనివారణ విరోధనములు, చిత్రపటపాకములు లేకున్న, శకుంతల మఱి యొక హంసపదిక యై శుద్ధాంతమున ఏమూలనో లెక్కలేక పడవేయబడియుండునుట మహాకవి చెప్పిన శాకుంతల నాయికానాయకుల శీలోదాత్తతను విశేషముగా రాజసౌజన్యఘనతను హంసపదిక తత్త్వమును ఎఱుంగమియే. విప్రలంభము లేక సంభోగము పుష్టి నొందదన్న రహస్యము సంప్రదాయవిదులగు పెద్దలు చెప్పినదే. 'తప్తేన తప్తమయసా ఘటనాయ యోగ్యం.' కాని 'పాలకులకు నాటి కూటమి' అని సుమతిశతకమును. విప్రలంభ మనగా అయోగమును, వియోగమును. కాళిదాసు తొలి మూడంకముల అయోగము సుభగతమముగా చెప్పనే చెప్పినాడు. శకుంతల జలాంజలి కోరినది, దుష్యంతుడు, ముడుగు జాఱి, మూడి జిక్కినాడు. అంతట సంభోగమును చెప్ప దిదిరినాడు. అది యించుకయే. ఏలన అది అంతలో చాలు నని పించును. 'నీకు అహ్లాదముగా చల్లగాలులు విసరుదునా? సుఖముగా నునుపాదములు పిసుకుదునా?—' అని యుపచారములు పలికించినాడు. అంత కొంత మెఱమెత్తి మోవి యానబోవునట్లు చేసినాడు. అంతలో ఒకతూఱి విడిచి మరల విప్రలంభముం జూపినాడు. తిరువాతి మరల కలిగిన సంభోగమున 'అక్లిష్టబాలతరుపల్లవ లోభనీయం పీతం మయా సదయమేవ రతోత్సవేషు' అని బహువచనముచే పెక్కు దినాల గలిగిన రతోత్సవములు సూచితమైనవి. కాని ఆ సంభోగము ప్రదర్శితము కాదు. తరువాతి మరల విప్రలంభమే— ఒకతట్టు దూరగతతచేత, ఒకతట్టు శాపహృతస్మృతిచేత. అది కరుణవిప్రలంభ పర్యంతమై అత్యంత మధురతమమైనది. తరువాతి పునఃసంయోగ సంభోగమునకే పరభాగముం గూర్చినది. అంతే. ఈ కరుణవిప్రలంభ మధురిమను ఆదికవి వాల్మీకి రుచిచూపినాడు. భాసుడు స్వప్నమునం జెప్పి లోటు తీసినాడు. ఈ కవికుల గురువు అతనిని ఇంకను మించినాడు. భవభూత్యనంగహర్షాదులు ఉత్తరచరిత తాపసాదులలో అనుకరించి ఆనందించినారు. అంతియే రహస్యము. అదియు సంప్రదాయము. మఱి "ఇట్లు కాళిదాసు కాముకతా వ్యసనమును 'పాపుల హృదయాంతరాగ్ని'లో కాల్చి నుసి చేసినాడు.........కవి ప్రథమాంకములోని నాయకుల సంయోగము వట్టి కాముక సంయోగమై విరోధ మాయెననియు, కడపటంకములోనిది, భరతుని తల్లిదండ్రులుగా వారు కలసికొనుటయు పవిత్రసంయోగమనియు తెల్పగా రుజువు చేసినాడు.........ఆమె దీర్ఘవిరహములు దుష్యంతునితోడి తొలిసంగముం బాపమును కడిగివైచినవి." అను రవీంద్రుని వాక్య ఇకేటి యుపన్యాసము! (తరువాత ఒకసారి ఉత్తరచరితయందలి సీతానిర్వాసముంబోలినది పిమ్మట మరల వియోగము ఎట్టిని కలిగియున్న!!) పట్టాభిషేకముం గోలుపోయి శుద్ధతాపసులైన సీతారాముల వనవాసము, అప్పుడు రావణ సీతాపహరము, అంతట యుద్ధాంతమున అగ్నిని కూడ పావనము చేసి సీత రాముం గూడుట పీనిం గూర్చి ఏమనవలెను? ఇట ఏపాపమును వియోగాగ్ని నుసి చేయుట? శకుంతలకు సౌజన్యము ఒగ్గు మొదలైనవి సహాభువులని రవీంద్రమహర్షియే చెప్పినాడు. జన్మాంతరమున ప్రస్మృతు అందు ఆ శాంతవియోగమును, ఆయన తనరాణివాసముం జొచ్చు ఆలగ్నమున ఆ మానిని శూన్యహృదయతయు నుర్వశీయమును; దుర్వాసునివలన కాక మఱి యెవ్వరివలనను తిట్టువడునది కాదు. అంగులీయకమైన ఆమె మారీచాశ్రమమున అభ్యసించి చేర్చుకొనవలసినది ఏదియు లేదు. 'అన్నియు పురాకృతము అనుభవమునకు వచ్చు కాలం గదు' అను సూక్తియందు సమాధానము గని సంతోషింపదగును. 'సా నిర్ఘృస్త్రీ సాన్ని భాగ్యాని బాలా' అనియు, 'పరిత్యక్త మత్సరేణ అనుకమ్ప్యతాస్మి దైవేన.' అనియు, 'నూనం మయా సుచరితప్రతిబన్ధకం పురాకృతం తేషు దివసేషు పరిణామాభిముఖమాసీత్.' అనియు శకుంతల తలపోసికొనును. వాల్మీకి రామాయణమున అశోకవన సీతయు అట్లే తలంచుకొనుచున్నది.—'కిం న్విదం తు మయా పాపం పురా జన్మాన్తరే కృతమ్? యేనేదం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణమ్.' అని. అట్లే వివాహితసీతయు 'మమైవ జన్మాన్తర పాత

కాలాం విపాక విస్ఫూర్జథు ర(ప్రసహ్యాః' అని. శకుంతలకు దైవ మెంతయు ప్రతికూలముగా నుండె ననియు, దానిని శిథిల్లచేయు కొఱకు పువంటి వాడు సోమతీర్థమునకు పోయియున్నాడనియు, ఆ సంగతి ఆశ్రమమున పెద్దలకును అంతరంగికముగా తెలిసియుండె నని నాటకమున మొట్టమొదట నే 'ఇదానీ మేవ దుహి తరం శకున్తలాం అతిథిసత్కారాయ నియుజ్య దైవ మస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః' అని వైఖానసులవారిమాట. ఆ యాత్ర తో డంగినది మొదలు దుర్దైవశమనము ఒకింత అగుచున్నను, తా సంకల్పించిన రాజాధిరాజు శకుంతలకై తానే ఆశ్రమమును వెదకి కొని వచ్చినాడో యన వచ్చి అట్టట్లు గాంధర్వమంగళ ము గావించి గర్భమును ఆధానించినను, అది దుర్వాసః శాపాదికమును బొత్తిగా మాన్ప జాలదాయెను. తాను యాత్రకు తరలగానే, దుష్యంతుడు ఆశ్రమమునకు వచ్చినాడు! తాను యాత్రనుండి మరలగానే శకుంతలం గూర్చి మంచిమాట చెవిం బడినది. ఆమె నాడే దుష్యంతునియింటికి తరలింపబడినది. శాపమును, శాపకార్యము అట్లు అపాటి నిరాకరణ పునఃసంయోగ ముల బర్యవసించుటయు ఎంతయో శాంతిగన్న దుర్దైవపు మొక్కవోయిన వేగమని యెంచదగును.

ఇకను రవీంద్రనుహాశ్రి కావించిన యీ శకుంతల గుణశీలముల విచారము అది యుండనీ; ఎట్లో ఓర్చు కొందము. మఱి దుష్యంతు గూర్చిన యీయన విచా రము కరము పాపిష్ఠమును అసహ్యమును అగును. దానిం జరిపిన పాపమునకు మనము ఎట్లు ప్రాయశ్చిత్తము చేసి కొందుమో! ఇదె చూడుడు.—

తొలుతనే శకుంతలప్రస్తావముననే 'శకుంతల ఇంకను అజ్ఞాతమదన. కావున ఆమె చిత్తమునకు తగిన వర్మమేమియు లేదు. అంగు లేదుచున్న రాగమును నమ్మకపోవుటకు గాని లేవుచున్న కాంతుని శీలమును సందేహింపను గాని ఆమెకు దిటముచాలదు.' అని దుష్యంతునియెడ దోషాశంకాంకురమును లేపినాడు. మఱి దుష్యంతుని శీలము ఉదాత్తము, వినయాలం కృతము, పవిత్రము, విశ్వసనీయము అని కాళిదాసు తొలుతనుండియు అల్లుకొనుచువచ్చుచున్నాడు. పిరా కిం బోలినవాడట! పురువంశ ప్రదీపసుండట! బ్రాహ్మణ వచనమున గౌరవ విశ్వాసములుగలవాడు. ఆశ్రమ మృగ మును కొట్టడు. పుణ్యాశ్రమదర్శన కుతూహలి. కణ్వ భక్తుడు. తపోవనమునకు ఉపరోధమును పరిహరించును. తన మనము ఆర్యమని ఆత్మ విమర్శచేసికొనును. మెఱపు దీగవలెవు ఆ యప్సరో రాజర్షుల యాత్మజపై అభి లాష వహించును. ఇట్టి యకలంకునియెడ కలంకము తోపజేయదగునా? ఈ నాయికానాయకుల యంధము ప్రార్థన పవిత్రముగానే నిర్వహింపబడినది; గ్రామ్యత ఇంచుకయు లేదు. శకుంతల దుష్యంతుని నమ్ముట; కాదు, దుష్యంతుడు శకుంతలను తిన్న నమ్మజేయుట- ఇందు దుష్యంతునియెడ మోసపుం బొగడయైనను కలదా? లేలను శకుంతలను క్రిందబడలాగినా డనదగునా? 'ఋషిభ్యో నాతిభిన్నే రాజని' అనియు 'వశిన' అనియు ప్రతిష్ఠితకీర్తి యగు దుష్యంతుని 'సద్వైతము' లేచుచున్నట్టియు శకుంతలా దుర్దైవము అపెంగు చున్నటియు ప్రకారముగదా ఇది కవిహృదయమువ? దుష్యంతుడు ఇంద్రునికిని రణసహాయుడు అని కణ్వాశ్రమమునను ప్రసిద్ధికలదు. తాపసకుమారులును ఎఱుంగుదురు. అంత దూరానను పరోక్షమునను విరూపవదకును అపాయమునకును, ఆశ్రమభవమునకు ఆశ్రమమృగ మునకు, దుష్యంతుడే రక్షకుడని ఆశ్రమ స్త్రీజనము నోటను-'దుష్యన్త మాక్రన్దస్వ' అన్నట్లు - మొదలు చుండు పేరినాడు. ఋషుల చిత్తమున "రాజర్షి గా" ప్రసిద్ధుడు. శకుంతలకు అందనిపం డగునని తోపనగును గాని నమ్మకముచాలనివాడని తోపగూడదు. అతడు సంతానహీనుడు, పుత్రార్థి; ఆ బ్రాహ్మణవచనమును గ్రహించినాడు. మంచి శుభశకునము చూచు కొన్నాడు. ఇంట అతని తల్లి పుత్రపిండపాలన వ్రతము చేయుచున్నది. కావున "పరిగ్రహబహుత్వేపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే, సముద్రరశనా చోర్వీ సఖీ చ యువయోరియమ్" అను మాటను దుష్యంతుడు త్రికరణశుద్ధిగా చెప్పినదికాని, అందును వందనవాదన యేని లేదు. ఉంగరము వ్రేలనుండి గనుపెట్టి పిలిపించు కొందు నన్నప్పుడును అతని చిత్తమున లేశమును మోసము లేదు. మఱి తాను హస్తినలో ఇంట అడుగు పెట్టబోవు నిముసముననే, అది తెలంచుకొనియే దూర్వా స్యనయముగా నున్న శకుంతలపై బడిన శాపము దుష్యం తుని స్మృతిం గొట్టినది. అది ఆత డెఱుంగడు. అంతట అతనికి సర్వమును మఱపే, తన శకుంతలా సమాగమము బోనకు అందని జన్మాంతర వృత్తమువంటిది, అయి పోయినది. దుష్యంతుం గూర్చి కణ్వుడు తాను తర లించుచో 'భర్తారం ఆత్మసదృశం' అనియు, ఆత్మగత మున 'త్రిశిథతో దుష్యన్తస్య యుక్తరూపమ్' అనియు, 'అభిజనవతో భర్తుః' అనియు, 'భర్తా తవ రృపిత కుటుమ్బభరేణ సార్ధం' అనియు అతి బహూమాన

పురఃపర నిర్దేశములం జేసెను. ఆయనశిష్యుడు, వనరు చొచ్చిన శార్ఙ్గరవుడు తన మనమున చిర రూఢమును అప్రమును అపాతముగా శార్ఙ్గణపదీవగిరియు నగు దుష్యంతుని రాచఠీకమును ఇట్లు మెచ్చుకొన్నాడు.

"మహాభాగః కామం నరపతి రభిన్న స్థితి రసౌ
న కశ్చి ద్వర్ణానా మపథ మపకృష్టోఽపి భజతే."

అని. అట్టి దుష్యంతునిం గూర్చి రవీంద్రర్షి చెప్పినాడు. "బహుభార్యుడగు దుష్యంతుడు శకుంతలను పోద్రోచుట అతని స్వభావమును బట్టి యోరకే నిజముగా ఎట్లును జరుగునదే. (కౌముదపలుడు, నూతనప్రియుడు)... ......రాజు పాపాత్మత మనకు తెలియుటకు కవి అతని పైకప్పున ఒక చిన్న చినుగునుండగా కల రూపుం జూపినాడు. అదే పంచమాంకము. శకుంతల వచ్చి, భర్తచే ప్రత్యాఖ్యాత యగుటకు రవంతముందు రాజాశ్వంగారవిషయముల (గుట్టు)మీది తెరను తుణను తిరిచి రత్నయుం జూపినాడు. హంసపదిక రాణి తనకు తానే సంగీతశాలలో పాడుకొనుచున్నది. 'అభినవ మధులోలుప స్త్వం తథా పరిచుంబ్య చూతమంజరీం, కమలవసతిమాత్ర నిర్వృతో మధుకర విస్మృతో స్యేనాం కథాం.' అని. రాణివాసమున నొగిలిన చిత్తమునం బొడమిన యీ యశ్రుసిక్తంపు పాట మనను తటాలున అనుకొనని యెదురుపాటుం గూర్చును; విశేషముగా మనచిత్తము ఇంతకుముందే (ఆశ్రమమున) శకుంతలతో రాజు పలికిన యనురాగంపు బాసలను వినియున్నందున..........ఆమెకు మహానురాగ భవనమగునని మనము ఆశగా ఎదురుసూచుచున్నదానిపై ఇపుడొక మాయని మచ్చ పడుచున్నది.............. రాజవలపు క్షణికము యగునను ఈ సూచన ఈ యంకారంభమున వృథాగా చేయబడినది కాదు. కడునిపుణతతో ఇట కవి దుర్వాసుని శాపకార్యమునకుం గారణము మానవ ప్రకృతిలోనే యున్నదని స్పష్టపఱచుచున్నాడు." (మఱి శకుంతల రొటుంగనట్టియు, తోడువచ్చిన ఋషియు లెవరును ఎఱుంగనట్టియు, దుష్యంతుడును ఎఱుంగనట్టియు ఆ శాపమునకు వేగా రంభ మెట్టులగునా అని ప్రేక్షకులు ఎదురుసూచుచున్నారు కదా.) 'The desertion of Sakuntala by the amorous Dusyanta which in real life would have happend as the natural consequence of his character, is here brought about by the curse of Durvasa.................. But the poet has left a small rent in the veil thro' which we can get an idea of royol sin. It is in the fiifth act. Just before Sakuntala arrives at court and is repudiated by her husband the poet momentrily draws aside the curtain from the kings love affairs. A woman's voice is heard singing behind the scene.

"O honey bee, having sucked the mango blossoms in your search for new honey you have forgotten the recent loving welcome by the lotus". (This is wrong-ren dering of the original or must be you 'have forgotten them, feeling all content and happy in your lotus abode.')

This tear stained Song of a stricken heart in the royal household gives us a rudo shock especially as our heart was hitherte filled with Dusyanta's love-passages with Sakutala.............And now a stain falls on the picture we had so hopefully formed of the home of love to which she was going. ............... This indication of the fickleness af royal love is not purposeless at the begining of the fifth Act. With masterly skill the poet here shows that what Durvasa's curse had brought about had its seeds in human nature." Tagore.

ఆ కావ్యరసా, ఇక్కడి నాటక సంవిధానము మహార్షి కీ రవీంద్రనాథునికి నంచుకయు బోధపడలేదు. విశ్వకవికి ఈ శాకుంతల సంప్రదాయము తెలియలేదు. శకుంతల పరమపతివ్రతయయి హిందూ స్త్రీలకు ఎంతటి లక్ష్యభూతురాలని రవీంద్రునిచే నిజశీలోపన్యాస ప్రశంసలం గన్నదో, అట్లే దుష్యంతుడును హిందూ పురుషులకు, గొప్ప హిందూరాజులకు లక్ష్యభూతుడుగా కవిచే ఉద్దిష్టుడు. మను మాంధాతలయు దిలీపరఘు శ్రీరాములయు వరుసకు చెందినవాడు, కాళిదాసు చిత్తవీథిలోను హిందువుల శిష్టగోష్ఠిలోను తొలి మెట్టున నుండువాడు, తనకు ఎందును మించినవారు లేనివాడు. అతనిని కాళిదాసు ఈ నాటకమున అట్టివానింగానే నిర్వహించినాడు. అట్టివానిం గూర్చి "బహుభార్యుడగు దుష్యంతుడు శకుంతలను పోద్రోచుట అతని స్వభావమునుబట్టి యోరకే నిజముగా ఎట్లును జరుగునదే.......

రాజు పాపాత్ముత మనకు తెలియుటకు కవి ఒక చిన్న ద్వారము తెఱచి చూపినాడు. అదే హంసపదిక పాట." అనుట ఎంత అనరానిమాట! శాంతము పాపము! శాంతము పాపము! మనశాస్త్రప్రవీణులగు కవికుల గురువు మహాత్ముడు కాళిదాసు 'అభినవ మధు లోలుపో' అను పాటను ఏ మహాప్రయోజనమునకై పాడించినాడో హంసపదిక చేత అది మహాత్ములు ఇందుకయి గ్రహింపరైరి. హంసపదిక ఒక భోగముపిల్ల. ఆ పేరే చెప్పుచున్నది. "శివాఖ్యస్తు ధారిణీ లక్ష్మీ ర్వసుమత్యాది నామభిః, భోగవతీ కాన్తిమతీ కమలా కామవల్లకీ, ఇరావతీ హంసపదీ త్యాగీ నామ్నా తు భోగినీ." అని సింహభూపాలుడు రాణులకును భోగినులకును తగిన పేరులను వేఱు వేఱుగా చెప్పినాడు. "హంసపదికాయా రాజ్ఞ శ్రియాత్ త్రిభువతీ ద్యుతచారో విదూషకః. హంసపదికా నామ భోగినీ రాజ్ఞః" అని శకుంతలా వ్యాఖ్యాత శ్రీనివాసాచార్యులవారు. 'హంసపదికా Was a Concubine వేశ్య of the king'- అని వేదము వేంకటరాయశాస్త్రులవారు. విదూషకుడు 'అది తన వారితో నన్ను జుట్టు పట్టుకొని కొట్టుమని చెప్పిన నేను ఎట్లు తప్పించుకొందును' అనుటయు, అందులకు రాజు 'నాగరకముగా తప్పించుకో' అనుటయు అది భోగముపిల్ల యింటి వృత్తి యని రూఢిసేయుచున్నది. ఆ హంసపదికతో 'సకృత్ కృతప్రణయోఽయం' - ఒక తూరి ప్రణయముం గలిపినాడట, దుష్యంతుడు. తరువాత ఊరక వసుమతి (దేవి) యింటనే యున్నాడు. మరల తనకడకు రాలేదు. అన్న మాదనగా తన మధ్యాహ్న నిత్య గీతాభ్యాసముగా మధుకరాపదేశమున ఈ వర్ణముం బాడినది. రాజు నవ్వుచు "ఆ యుపాలంభమును గ్రహించితిని" అని చెప్పిపంపుట "మరల ప్రణయమును సాగింతునులే— వేడ్కో రావొత్తునులే" అని యూరట తెలుపుటయే. అట్లు నవ్వగా అంతట హంసపదిక ప్రస్తావము ముగిసిపోయినది. అటుపై వేఱు ప్రస్తావము. ఏమనగా, అంతట రాజు అనును— 'కిం ను ఖలు గీతమేవం విధార్థ మాకర్ణ్య, ఇష్టజనవిరహాదృతేఽపి బలవదుత్కంఠితోఽస్మి. అథవా—

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోఽపి జన్తుః,
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.' అని.

'ఇతి పర్యాకుల స్తిష్ఠతి' అన్నాడు కాళిదాసు. ఈ యుత్సుకతను, పర్యాకులతను దాని తెలివిడినో గూర్చి, కాళిదాసు కాక మఱెవ్వడు చెప్పగలడు, దుష్యంతుడు కాక మఱెవ్వడు దానిని పడుచు ఇట్లు నాగరకత్వముం బొరయింపగలడు! శకుంతలాసంయోగము, రాజునకు ప్రీతి శాపహేతుకమైనందున, అబుద్ధి భావస్థిర జననాంతర సౌహృదముంబోలె నైపోయినది. దుష్యంతుని పర్యాకులత తనకు ఎఱుంగరాని నిజవిరహితవలన నే అనియు, శాపమున్నను రతికి శకుంతలా విరయోగ విచ్ఛేదము కూడమిచే ఇది యిట్లని రెఱుంగ రాని మొగమొగయు అకులపాటును అయినదన్న మానసిక రహస్యమును కాళిదాసు ఇట్లు అనన్యసాధ్యముగా చెప్పినాడని సంప్రదాయవిదులు అందురు. ఈయంకము కథ శకుంతలకన్నను దుష్యంతునికి పరీక్ష; ఆమె బాధకన్నను దుష్యంతునిబాధ నే ఎక్కువగా చెప్పవలదగును. కాదా వారిది మనకు ద్రష్టలకు ఒక్క తెలియదే. అయ్యో ఆమె ఇక నేమిసేయగలదు అన్నట్లు అయ్యో అత డింక నేమిసేయగలడు అనిపించును. 'Sakuntala feels as if she had been struck with a thunderbolt'అన్నాడు రవీంద్రుడు. అట్లే 'Dusyanta feels as if he had been struck with a thunderbolt' అనదగును. 'అహో ధర్మాపేక్షితా భర్తుః! ఈదృశం నామ సుఖోపనతం రూపం దృష్ట్వా కోఽన్యో విచారయతి!' అని కన్నవారు విన్నవారు దుష్యంతుని ధర్మాపేక్షను మెచ్చుకొన్నారు. అది కాళిదాసు హృదయము. 'వ్యపదేశ మావిలయితుం కిమీహసే జన మిమం చ పాతయితుం?' అని దుష్యంతుడు బిట్టు ఏడ్చినాడు! ఇందు పుటము తీసిన పదియార్వన్నె బంగారమైనాడు. తరువాత సానుమతి దుష్యంతుం జూచుచుండినపుడు శకుంతలకై నతని యాజన్మ దుఃఖమునకును వసుమతీదేవిని తప్పించుకొనుటకు అతను పడినపాటు పలికిన పలుకు వెంచి చూచి 'అన్యసంక్రాన్తహృదయోఽపి ప్రథమసంభావనా మపేక్షతే. అనో ఽనిభృత సౌహృద ఏష ఇదానీం' అని దుష్యంతుని దాక్షిణ్యమునకు అతను వారిం గూర్చిన మగవారిపట్టులు కనిపట్టగల తన యప్సరః ప్రాగల్భ్యముతో రాజును పలికినది. అనుశయముచే ఈతని హృదయము గాఢముగా శకుంతల యెడ సంక్రాంతమని సానుమతికి ఇంతవట్టు ప్రత్యక్షమేగదా. పనసు ఇతడు అంతఃపుర ప్రతిష్ఠితమైన

పోవుచుండగా వినుచు వాయుస్కంధములను వరుసగా దిగుట, వచ్చును హేమకూటమున, అటు స్వర్గమునం గాక ఇటు భూమినిం గాక, అంతరాళమున నుండి, స్వర్గమునకన్న నిర్వృతి యిచ్చు అమృతహ్రదమువంటి చోట, ఎటు చూచినను కల్పతరువ్రిందనే పసిడి తామరకొలకుల చెంతనే చింతామణిశిలల మీదనే, అప్సరః పరిచరితులగుచునే యుండి, తెఱచిన కన్ను మూయకయు మూసినకన్ను తెఱవకయు ఏకధారాధ్యానముగా తపముచేయు ఋషులుండుచోట మారీచాశ్రమమున ప్రవేశించి సత్త్వదమనునితోడి శకుంతల పునఃసంయోగముపొంది, అదితి మారీచుల దర్శనము చేసికొని తిరలి సకల సామ్రాజ్యభోగములకు హస్తినకుం గాళా చేరుట—ఇది యదృశమైన భూస్వర్గ సంయోగముగదా? ఇవే యగునా ఆ రెంటొక్కటనైన భూస్వర్గసంయోగములు, గీటే తన మనసునకు తెచ్చుకొన్నవి? నాడు అట్లు వీథిలో విడచుచున్న శకుంతలను తల్లి మేనక కొనిపోయి హేమకూటమున మారీచాశ్రమమునం జేర్చెను. దాని ప్రయోజన రహస్యమును కాళిదాసు దుర్వాసునిచే చెప్పించినాడు. అతడును అనుశయదుఃఖాగ్నిలో సుత్తు తెలియునట్లు మాడి యను భావనాశ్రమముతో నుండి వాడు స్వర్గమునుండి వచ్చు దారిలో మాతలిచే అచటికి చేర్పబడెను కదా. అచట అడుగు మోపగానే ఆత్మను జిల్లుమనగా 'స్వర్గాదధికతరం నిర్వృతిస్థానం! అమృతహ్రదమివ అవగాఢోఽస్మి' అని యన్నాడు. ఎట్టి భిన్నచిత్తమును అచట తనంతట ప్రసాదము గనును. కావున నాడు శకుంతలయు, తల్లి తన్నచట దింపగానే, తనంతట అట్టి చిత్తనిర్వృతి గన్నది. రవీంద్రుడు చెప్పిన యీ పుట్టుపతివ్రత శకుంతల తన యెఱింగిన యేకారణమును లేకయే తాను భర్తృనిరాకృతయైనందున, మఱి తనకు ప్రత్యాఖ్యాన కారణము లేమి, ఫలము కోరకయే ఆతాపనసిద్ధిక్షేత్రమున, దేవతాగురువుల సాక్షాత్సన్నిధిలోను ఎఱుకలోను, ఇక్కడ అంశమును ఇట్లే యున్నట్లు, సాధారణముగానే విరహవ్రతము తొడంగినది. మారీచుల వారికి శకుంతలను చూడగానే శాపమును, దాని నివృత్తి కాలక్రమములును చిత్తమున పొలసినవి. అదియే ఆమెకు ఆయన కరుణాకటాక్షము. కాలమున భర్తృపునఃసంయోగఫలము సమకూడినది. మఱి మాలినీతీరపు ఘాను దైహిక కామసంయోగము అనుశయదుఃఖమునను విరహదుఃఖమునను కూడి స్వర్గశ్రీకై ఆత్మప్రేమసంయోగమైనది. శాకుంతలమున ఒక్కట భూస్వర్గసంయోగమున అని యవి రవీంద్రదర్శి వాక్యము. మఱి తొలియంకమున 'కృష్ణసారే దదచ్చక్షుః' అను మాటతో తొలి భాషితము మొదలుకొని కడపటి మారీచుల యాశీర్వాదము 'త్వయి భవతు బిడౌజాః ప్రాజ్యవృష్టిః ప్రజాసు' అను ముగింపువఱకు 'భావో భావం నుదతి విషయాద్రాగబంధః స ఏవ' అన్నట్లు ఏకరాగబంధముగా వెల్లివిరిసిన శాకుంతల శృంగారరసంపుమడుపు పెద్దలు అనుశాసించిన యీ 'సద్యఃపరనిర్వృతి' పొంగారుచుండగా 'ఆత్మ దేవ సంతసము గొనునో, సుఖపరవశము గునో, పండువు గనునో విందారగించునో అది యెల్ల బ్రహ్మానంద సబ్రహ్మచారిగా సమృద్ధమైనది. గీటే Wouldst thou the young years' blossoms' ఇత్యాది ఆత్మానందోద్గారమునకు ఇదెల్ల ఇందుక ఒక తెలుంగు సమర్థనము గునా?

"పాపక్షయశ్చ పునాతు వర్ధయతు చ
శ్రేయాంసి సేయం కథా
మఙ్గల్యా చ మనోహరా చ జగతాం
మాతేవ గఙ్గేవ చ."

"సరస్వతీ శ్రుతిమహతాం మహీయతామ్."

# గృహోన్ముఖుడు

## శ్రీ తాడిగిరి పోతరాజు

మునిసిపాలిటీ కార్యాలయంనుంచి బ్రహ్మరాక్షసిలా కేక పెట్టింది 'సైరను'. రాత్రి ఎనిమిది గంటలయిందని గ్రహించి, అందరూ త్వర త్వరగా తమ తమ కార్యకలాపాలు ముగించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నారు. అప్పటివరకూ కార్యసాధనలో నిమగ్నులై ప్రపంచాన్ని మరచిపోయినవ్యాపారస్తులు, రాజకీయవేత్తలు, సైరను చెవుల్లో 'గింగురు' మనేసరికి త్రుళ్లిపడి, ముంజేతి వాచీచూసుకొని, ఒకరివద్ద ఒకరు సెలవుతీసుకోవటాని కుపక్రమించారు. దుకాణాదారులు, డబ్బు లెక్క పెట్టుకొని, కొట్లు మూస్తున్నారు.

పగటివేళ ఆ బజార్లతోనున్న అవసరాన్ని రేపటికి వాయిదా వేసి అందరూ సర్దుకుంటూన్న వేళలో, ఆ ప్రదేశానికి వింత వ్యక్తులు, కొత్త వ్యక్తులు పోగవుతున్నారు. రాత్రించరులను ఆహ్వానించటానికై వికృతంగా తీగలు చుట్టుకొని నిల్చున్నాయి విద్యుద్దీప స్తంభాలు. ఉదయం ఆఫీసులకు బయలుదేరే ప్రభుత్వోద్యోగుల్లా జారులు, చోరులు మెయిన్‌రోడ్డు ప్రవేశిస్తున్నారు. వీరి కార్యసాధనకు అనుకూలసమయం యీ నిశీథిని. వీరితోపాటుగా, వీళ్ళ సవతిపిల్లలైన పోలీసులు ధర్మరక్షణార్థమై, ప్రజాక్షేమం కొరకు, విజిల్స్ వేసుకొంటూ, సంజ్ఞలు చేసుకొంటూ జాగరణకు సిద్ధపడుతున్నారు.

ప్రతిరోజూ, ఈ వేళకు, ఈ రెండువర్గాలకు చెందిన మానవులు ఆదారిలో ఆ సినిమాహాలు ముందున్న సత్రంవద్ద సమావేశమౌతూంటారు.

ఆ సత్రం రెండస్తులమేడ. క్రిందిభాగంలో అరఫర్లాంగుపొడుగునవున్న ఆ పంచపాళిలో నానా జాతిసమితి సమావేశం జరుగుతూంటుంది. ఆ పంచకు ముందు భాగాన, శిథిలమై చిల్లులు పడిపోయి జీరాడుతున్న మురికిగోనెపట్టాలు వ్రేలాడుతున్నాయి. వాటి చెంతనే, అతుకులు వేసిన కావిగుడ్డలు, చీరెలు ఆరకట్టబడివున్నాయి.

సత్రంలో జనంమాత్రం పల్చగనే వున్నారు అక్కడక్కడ ఓ సన్యాసీ, మురికిగుడ్డలమూటలు, వాటి చెంతనే నగ్నశరీరులై నిద్రిస్తూన్న అనాథపిల్లలూ, తప్ప మరెవ్వరూ లేరు. ఆ సత్రాన్ని చిరకాలంగా కనిపెట్టుకొని బ్రతుకులు సాగిస్తున్న మహానుభావు లందరూ, ఇంతకుపూర్వమే "మాదాకవళం తల్లీ!" ఉద్యమంలో పాల్గొనటానికి వెళ్ళారు. ఇప్పుడా ఉద్యమ నాయకు లందరూ, జట్లు జట్లుగా చేరుకుంటున్నారు. అంధులు, అంగవికలులు, కుష్టురోగులు, వర్గభేదం పాటించి, ఎవరి నిర్ణీతస్థలాల్లో వారు ఒదిగి కూర్చుంటున్నారు.

వీరు కాక భిక్షాటనచేసినవారు క్రిందనున్న మురుగు కాలువ చెంతనే వంటప్రయత్నం సాగిస్తున్నారు. పొయ్యిక్రింద మంటకొరకు కారుటైరుముక్కలు, చెత్తచెదారం ప్రోగుచేసి, కాల్చుతున్నారు. వాళ్ళకు సమీపంగా 'డస్ట్‌బిన్'లో చేరి రెండుపందులు మామిడివిత్తనాలు కొరుకుతున్నాయి. మందంగా నిశ్చలంగా ప్రవహిస్తూన్న ఆ మురుగుకాలువ, అదోరకమైనదుర్గంధాన్ని వెదజల్లుతోంది. కాలుతున్న ఆ టైరు ముక్కలు అదోరకం కంపుకొడుతున్నాయి. ఏ వాసన ఘాటుగావుందో నిర్ణయించలేక బాటసారులు ముక్కుకు 'రుమాలు' అడ్డంపెట్టుకొని నడకసాగిస్తున్నారు. అయితే ఆ వాసన, అక్కడ అరుగుపై ఆసీనులైన వ్యక్తులపై ఏలాటి ప్రభావం చూపలేదు. ఒక్కరు తప్ప అందరూ, అనేక అనుభూతులతో, స్మృతులతో, నిర్లిప్తంగా కూర్చున్నారు, మామూలుగా పార్కులో కూర్చున్నట్లు. ఆ వ్యక్తి ఎదురుగానున్న దిమ్మెకు కాళ్ళుతన్ని పెట్టి, తలక్రింద ఒక పాతగుడ్డల మూట పెట్టుకొని కళ్ళుమూసుకున్నాడు. రబ్బరు కాలుతున్న వాసన భరించలేక "ఛీ...పాడు గబ్బు...గబ్బుకొడుతోంది...ఎవడ్రా అక్కడ" అని గర్జించాడు. ఆదెబ్బతో, అక్కడచేరిన దైవస్వరూపులందరూ అటుకేసి చూశారు. మెరుపులావచ్చి ఆ పొయ్యి వెలుగు అతనిముఖంపై పడింది. కోటేరులా ఇంత పొడుగు ముక్కు, రెల్లుదుబ్బుల్లావున్న కనుబొమలు కుంచించుకు పోయాయి. గుంటలుపడిపోయి, జ్యోతుల్లా మెరుస్తున్నాయి కళ్ళు. వెలుగు ముఖంపై బడగానే కను

రెప్పలు ముకుళించాయి. బాధగా కళ్లుమూసికొన్నాడు. దవడ ఎముకలు ఎత్తుగా ఉబ్బి బయటికి పొడుచుకొస్తున్నాయి. "మంట ఆర్పుతున్నావులే!" భయకంపిత స్వరంతో, దీనంగా సమాధానమిచ్చింది ఒక కంఠం పొయ్యిదగ్గరనుంచి. దానితో తృప్తిపడి ఆవ్యక్తి మళ్ళీ వెనుకకు చేరగిలపడ్డాడు. అయినా విసుగు, కోపం తగ్గలేదు. "ఎదవనక్షత్రం...ఎదవనక్షత్రం" అని గొణుక్కున్నాడు.

అంతలో అక్కడకు మరొక బికారి చేరాడు. పడుకున్న ఆ వ్యక్తికేసి కోపంగా చూశాడు. కాని పడుకున్న వ్యక్తికి ఆ చూపు కన్పించలేదు. ఇక లాభం లేదనుకొని "ఏయ్! ఎవరు నువ్వు? నాపోట్లోనుంచి లే" అన్నాడు.

పడుకున్న వ్యక్తి కదలలేదు. పలకలేదు.

"నీకేనోయి చెప్పేది. లేస్తావా! లేవ్వా?" అని రెట్టించాడు, ఆస్థలం వాడి 'జన్మహక్కయి'నట్లు. మళ్ళీ రెండుసార్లు పిలిచాడు.

ఈసారి పడుకున్న వ్యక్తికి ఒళ్లు మండిపోయింది. చివ్వనలేచాడు సిగ్నలు రేకులా..."లేవనోయ్...ఏం చేస్తావేం?" అని హుందాగా రొమ్ము విరుచుకొని పలికాడు.

ఆ రకంగుల మనిషి కసాయివాడి భంగిమలో లేచి నిల్చేసరికి గుండె జల్లరించింది. కాని ఇప్పుడు నోరు మూసుక్కూచుంటే, అందరిదృష్టిలో లేపు పల్చనయి పోతాడు. ఈ ఆలోచన తట్టగానే కోపం పొంగిపోయి "టూత్ పేస్టు"లా బయటికొచ్చింది. "ఈపోట్లో నేజా నేపండుకుంటున్నాను......ఇప్పుడు నువ్వు లేస్తావా? లేవ్వా?" అన్నాడు సమస్య పరిష్కారానికి ఏదో మార్గం కనిపెట్టినట్లు: "లేవని నీ కెన్నిసార్లు చెప్పాలోయ్?... కావాలంటే ఒక దెబ్బ చూసుకో" అని క్రోధావేశమూర్తియై పిడికిలిబిగించి, చెయ్యిపైకెత్తి గోడపై ఆన్చాడు.

రెండవవ్యక్తి పోల్చిచూస్తే పొట్టిమనిషి. అతను చెయ్యిపైకెత్తగానే గుండెలాగినంత పనయింది. శరీరం కంపమెత్తింది. అయినా ధైర్యంచేసి "ఏమిటోయ్! కొత్త జరగవయ్యా! అంటే పెద్ద వస్తాదులాగ మాటాడతావ్...ఎంతగుండెని కొడతావు నువ్వు?...అసలు నేనెవరో తెలుసా...జాగ్రత్త..."అంటూ తన గళ్ల లుంగీ సగానికి మడిచి నడుంపై చుట్టుకున్నాడు. తరువాత చేతులు పైకి తీస్తున్నాడు.

ఇంతలో ఓటాక్సీ ఆ ప్రాంతం గుండా దూసుకుపోయింది. అప్పుడా కారు దీపపు కాంతులు ఒక్క క్షణం వాళ్ళమీద ప్రసరించి, ఆ దిమ్మెలన్నిటినీ వరుసగా దాటిపోయాయి. ఆ కాంతిలో, రౌద్రమూర్తియై, నిలుచుండవానికి సిద్ధమై పెదిమలు కరచిపట్టుకున్న మొదటివ్యక్తి ముఖాన్ని రెండవవ్యక్తి సుస్పష్టంగా చూశాడు. నరాలు పెల్లుబికి, శరీరకష్టం స్ఫురింపచేసే అతని దృఢకాయం, రెండవవ్యక్తిలో గతి స్మృతులను తట్టి లేపింది. కాని ఇప్పుడా ఆలోచనకు తావులేదు. కాని ఆ స్మృతితో భయం ఉద్ధృతమైంది.

ఇద్దరూ ఆభంగిమలో నిల్చుని, ముష్టియుద్ధానికి సన్నద్ధులౌతూంటే, పక్కనవాళ్ళంతా నిష్పాక్షికంగా ఐక్యరాజ్యసమితి పర్యవేక్షకబృందంలా పరిశీలిస్తున్నారు. ఆ పరిస్థితులలో ఒక అంధుడు కలుగజేసికొని "ఏమయ్యా? ఈపోటు మీఇద్దరిలో ఎవరిదీకాదు... రవ్వంత కునుకుతీసి పొద్దున్నే పొయ్యేవాళ్ళ కెందుకీ కొట్లాట...అరుచుకోవటం" అని తీర్పు చెప్పారు. ఆ తీర్పులో జాలి, శాంతిప్రియత్వంకన్న "పోలీసుల భయం" ఎక్కువగా ప్రతిధ్వనించింది.

ఇంతలో మరోకారు ఆ రోడ్డున వెళ్లటంవల్ల, ఆ ప్రాంతంలో మసిబొగ్గుతో గీయబడిన, పెద్దపులి, పోలీసు, కోడిపుంజు, కత్తిసాముచేస్తున వీరులు - మొదలైన చిత్రాలు కన్పించాయి. పోలీసుబొమ్మ చూచి అందరికీ భయం వేసింది. వచ్చాడంటే అందర్నీ పెళ్ళగొడ్తాడని స్ఫురించగనే ఎవరితావులకు వారు వెళ్ళిపోయారు.

ఆ పెద్దపులిబొమ్మ జూచి కలవరపడ్డాడా రెండో వ్యక్తి. ప్రేక్షకబృందం రాజీనామా యివ్వటంతో పోరాటంలో పాల్గొంటూన్న అభ్యర్థులు వెంటనే, కాలిపోయిన గడ్డివాముల్లా క్రిందకొరిగి దూరదూరంగా చతికిలబడ్డారు.

*    *    *    *

ఆ గళ్ళలుంగీవ్యక్తికి నిద్రపట్టలేదు. గతానికి సంబంధించిన ఎన్నోదృశ్యాలు మురికిదుప్పటిపై ముసురుతున్న దోమలాగా కళ్ళముందు మెదలసాగాయి. పది సంవత్సరాలక్రితం, తను ఒక బాలికమెడలో గొలుసు అపహరించిన నేరానికి కారాగారశిక్ష విధించారు. అప్పుడు తనగదికి ఎదురుగానున్న గదిలో "వీరాస్వామి" అనే ఖైదీ వుంటూండేవాడు. హత్యానేరం ఆరోపింపబడి ఎలానో మరణశిక్షతప్పి ఇరవై సంవత్సరాలు కారాగారవాసం అనుభవిస్తున్నాడు.

అక్కడీ ఆజానుబాహువు, ముగ్గురు మనుషుల పెట్టున పని చేసి, వార్డెన్లు పోసే ఆ రాగిగంజి. ఘుడిలా పీల్చిపారేసి పడుకోని ఎనుబోతులా గుర్రుపెట్టేవాడు. తోటిఖైదీలందరికీ అతనంటే భయం, అభిమానం. అస్తమానం అంగకాగబంధురమైవున్న అరుపులో పడి వుండేవాడు. పాతుంత్రం, ఒక అర్ధగంట సేపు. ఖైదీలను శృంఖలాబద్ధులను చేసి వాయుసేవనం కోసం బయటికి తోలేవారు. ఆ సమయంలో, ఖైదీలందరూ, వినోదంగా కబుర్లు చెప్పుకొని సంతోషించేవారు. అప్పుడుకూడ అతను మౌనవ్రతం చాలించేవాడు కాదు. ఎప్పుడు విడిచి పెడ్తారనే తహతహ, విముక్తి పొయ్యాక ఏమిచెయ్యాలనే భావాలూ ఉద్భవించేవి కావు. నిరాశ, వ్యాకులత ప్రస్ఫుటమౌతూండేవి. నున్నగా గొరిగింపబడిన బోడి తల, చాలీచాలని ఆకళ్ళతో క్కాతో వికారంగా వుండేవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే, అతను చేసిన అపరాధానికి శిక్ష అనుభవిస్తూన్నట్లు, పశ్చాత్తాప పడుతున్నట్లు కనిపించేవాడు కాదు. వెలుతురు కానీ, గాలి కానీ ప్రవేశింప శక్యం కాని ఆ కారాగారానికి రారాజులా గంభీరంగా వుండేవాడు.

ఒకరోజు ఖైదీలందరూ, శృంఖలాలు గలగలమని రొదచేసికొంటూ గుట్టలు గుట్టలుగా చేరి చెవులుకొరుక్కుంటున్నారు. ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ చెప్పుకొని, ముఖాలు కందగడ్డలా పెట్టుకుంటున్నారు. కొందరు నానాబూతులు తిడుతున్నారు. ఆమాటలు వీరాస్వామిలో కొంతచైతన్యం కలుగజేసినాయి. అతనిమౌనముద్ర విచలితమైంది.

"ఆడవాళ్ళవార్డులో ఒక గర్భిణీస్త్రీని జెయిలరు బలంకొద్దీ తన్నాట్ట. ఆ అక్రమదౌర్జన్యంవలన, పిండం జారిపోయి, ఆమె మరణించింది" ఇది అసలు జరిగినసంగతి. ఆ దుర్ఘటనను గూర్చిన విశేషాలు మరీ మరీ తర్కించుకొనేలోగా, ఖైదీలలో పరికెళ్ళకలసిన ఆవశ్యకతను సూచిస్తూ వార్డులో గంట వినిపించింది. వెంటనే వార్డెను వెళ్ళటానికి హుకుం జారీచేశాడు. సంకెళ్లు గలగలలాడించుకొంటూ, స్వపాదవిన్యాసంతో ఆవాట ధూళిధూసరితం చేసికొంటూ, ఎవడి 'ముంత' (గంజిత్రాగేపాత్ర) వాడు తీసుకొని, చీకటి గదుల్లో జొరబడ్డారు.

పైదుర్ఘటనను పురస్కరించుకొని రెండవరోజు వార్డులో చిన్నగల్లంతు జరిగింది. జైలరు వార్డెనులను వెంటనిడుకొని పర్యవేక్షిస్తున్నాడు. ప్రతిగదిలోకీ తొంగిచూచి తాళపుకప్ప లాగి చూస్తున్నాడు. వీరాస్వామిగదిలోకి చూసి "ఏం శివయ్యం జాగ్రత్త...పొగరుబోతు...దబద దబాదు" అన్నాడు. అప్పటిదాని పెనవి పెనవన్న కోగవిరాపం, మరింత సాగనుగా వాక్యం చేసింది. "దయనుగూర్చి నువ్వయినా వాళ్ళకు సొప్పరా" అన్నాడు. కోపం, అసహ్యం, బాధ సమ్మిళితమైన గొంతుతో...వీరాస్వామి

ఆమాటలతో జెయిలరు ముఖం నల్లబడిపోయింది. "ఏమిట్రా, రాస్కెల్! దయనుగూర్చి చెప్పాల్రా నీవు" అంటూ లోపల ప్రవేశించి బెత్తంతో ఒక దెబ్బ కొట్టాడు. మళ్ళీ రెండో దెబ్బకొట్టటానికి చెయ్యి పైకెత్తాడు. కొట్టబొయ్యేసరికి, వీరాస్వామి అతని చెయ్యి లంకించుకొని క్రిందకు వంగతీశాడు వంగతీసి, పందిమెడలా ఉబ్బిపోయిన అతని మెడపట్టుకొని రెండుమూడు నిముషాలసేపు కిక్కురు మనకుండా బంగా ఒత్తిపట్టి...అటూ ఇటూ రెండుఊపులు ఊగించి గది బయటికి త్రోశాడు. చేతులు రెండూ అడ్డంగా గొలుసుతో పరివేష్టితమైవున్నాయి కాని లేకపోతే ఈపాటికి మెడ ఇంకెంతలా వున వాచిపొయ్యేది.

ఆ దృశ్యాని తిలకిస్తూ వార్డెనులు ఇద్దరూ స్తంభించిపొయ్యారు. జెయిలరుకంటేముందువాళ్లిద్దరూ మూర్ఛపోయినట్లు కనిపించారు. జెయిలరు గదిబయట పడినవెంటనే వాళ్లు ఈప్రపంచంలో పడ్డారు. వెంటనే ఆఫీసరుగార్ని ఆదరా బాదరా లేవనెత్తారు. జెయిలరు లేచి మెడసవరుకుంటూ "కాల్చిచంపేస్తా రేపు...పొగరుబోతు వెధవా—అసలు నీకు మరణశిక్ష విధించాల్సింది." అంటూ గది ఇవతల నిల్చుని వీరాస్వామి మొఖాన పెళ్ళుపెళ్ళున రెండుదెబ్బలు చరిచాడు.

దీనిని ఎదురుగదులలో వున్నవారు స్పష్టంగా చూశారు. చూడలేకపోయిన ఖైదీలుస్వనులను బట్టి పరిస్థితి ఊహించుకున్నారు. వెంటనే హర్షధ్వానాలు ప్రకటిస్తూ 'హే' అని నవ్వారు. ఆ నవ్వు భరించలేక జెయిలరు "షటప్" అన్నాడు రొప్పుకుంటూ. సీమపంది లాంటికళ్ళతో జైలు గదుల వాకిళ్ళన్నిటివేపూ ఒక చూపు విసిరాడు. క్షణంలో ఆ నవ్వు అంతర్ధానమైంది. జెయిలరు వెళ్ళిపొయ్యాక పలుమూలలనుండి, "భలే పని చేశావురా!" అంటూ అభినందనాలు వచ్చాయి.

రెండవరోజు, హత్యప్రయత్నమని జెయిలరు చేసిన అభియోగం ఫలితంగా వీరాస్వామికి ఐదేళ్లు కారాగారవాసం పొడిగించబడింది. దానితోపాటుగా ముప్పయి కొరడా దెబ్బలు స్వీకరించాడు.

ఈసంఘటన ఇప్పుడా గళ్ళలుంగీ వ్యక్తికి స్మృతిపథంలో నిన్న జరిగినట్లు కనిపించింది. ఇప్పుడికగొంతు,

